ఓం శివాయనమః

# ఈశగేయామృతము

రచయిత:— శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు.

(ఏతీరుగ ననుదయజూచెదవో ఇనవంశోత్తమ రామా (అనుమాదిరి)

1. శ్రీశివ! శంకర! చిద్ఘనరూప! సుశీలసుధీ ప్రద! ఈశా!
2. కాశీవాసా! కల్మషనాశక! కామహరా! గౌరీశా!
3. శైలజభావవికాస సుబోధక! శాంతి సుధాకర! ఈశా!
4. బాలశశికళాధర సంశోభిత! భ్రాంత్యాపహా! పరమేశా! ||శ్రీశివ||
5. నీలసుకంధర! నిర్మలగుణగణ! నిర్విషయాంతర! ఈశా!
6. కాళీప్రియకర! కరుణాసాగర! గంగాధర! గౌరీశా! ||శ్రీశివ||
7. ఉరగాభరణా! కరిచర్మాంబర! ఓ జో భరితా! ఈశా!
8. పరమానంద సుధారస నిలయా! పాపహరణ! పరమేశా! ||శ్రీశివ||
9. సురవందిత పద! సుజనసుపూజిత! శోక నివారక! ఈశా!
10. హర! త్రిపురాంతక! ఆమయనాశక! అతులితపద! అమరేశా! ||శ్రీశివ||
11. ధ్యాననిమగ్న వికాస సువిగ్రహ! దాంతివిరాజిత! ఈశా!
12. మౌనిహృదంతర నిత్యనివాసా! మారవినాశ మహేశా! ||శ్రీశివ||
13. సృష్టి స్థితి లయ కారణ భూత! వశీకర సుజనా! ఈశా!
14. శిష్ట జనాదర! ధర్మోద్ధారక! క్షేమంకర! విశ్వేశా! ||శ్రీశివ||
15. నీరదఫేన మరాళ తుషార ఫణీశ నిభోజ్జ్వల! ఈశా!
16. చారు వివేక జనార్చిత పదయుగ! జాడ్యాపహ! జగదీశా! ||శ్రీశివ||
17. ప్రేమసుధారస పూరితహృదయా! భీతివిభంజక! ఈశా!
18. కామితఫలదాయక! నిర్మలఘనకాంతి నిలయ! కాళీశా! ||శ్రీ||
19. మార్కండేయ మహాముని పూజిత! మందస్మితముఖ! ఈశా!
20. అర్కానలశశినయన సమేతా! ఆర్యాహ్లాద! మహేశా! ||శ్రీ||
21. ఉపమన్యు మహా మౌనీశ్వర నుత! చపల విభంజక! ఈశా!
22. జపయజ్ఞ మహాఫలశమదాయక! జయధీయుత! జగదీశా! ||శ్రీ||
23. నిర్మల నిశ్చల నిర్గుణ నిరుపమ నిత్యనిరామయ! ఈశా!
24. కర్మఫలప్రద! కళ్యాణాకర! కపటరహిత! కామేశా! ||శ్రీ||
25. భస్మవిలేపన భవ్యశరీరా! ఫణిపతివేష్టిత! ఈశా!
26. విస్మయజనక విశేషతపః ఫల! విజ్ఞానద! విశ్వేశా! ||శ్రీ||
27. రావణగర్వ నివారక! నిర్మలరమ్యచరిత్రా! ఈశా!
28. భావితభద్ర వికాసగుణాలయ! భక్తప్రియ! పరమేశా! ||శ్రీ||
29. బ్రహ్మముకుంద సురేంద్ర సుపూజిత! పావనపదయుగ! ఈశా!
30. బ్రహ్మాత్మైక్య వివేక సుధీప్రద! పరమాత్మా! పరమేశా! ||శ్రీ||

31. జన్మజరామృతి హేతునివారక ! జడచంచలహర ! ఈశా !
32. మన్మథశర దుర్వ్యథ సంహారక ! మధురాలాప ! మహేశా ! ॥శ్రీ॥
33. స్థావర జంగమ భువన నియామక ! సచ్చిత్సుఖమయ! ఈశా !
34. లావణ్యామృతరసమయ హృదయా ! లతితాప్రియా! పరమేశా ! ॥శ్రీ॥
35. అభయవరప్రద ! అఘపరిహారక ! ఆహ్లాదాస్పద! ఈశా !
36. శుభమయ ! శమదమ సూరిమనోహర ! సురగురునుత ! పరమేశా ! ॥శ్రీ॥
37. శాశ్వదసుఖదా ! షణ్ముఖ జనకా ! సంకటభేదక ! ఈశా !
38. విశ్వవిలక్షణ ! వేదాన్తజ్ఞా ! వేదమయా ! విశ్వేశా ! ॥శ్రీ॥
39. ప్రమథాధిప ! భవబంధ విమోచక ! పావనచరితా ! ఈశా !
40. సమదర్శన యతి సన్నుత లక్షణ ! సామప్రియ ! సర్వేశా ! ॥శ్రీ॥
41. చందనలేపిత చరణ సరోరుహ ! స్కందాదిప్రియ ! ఈశా !
42. మందస్మిత శశిసుందరవదనా ! మాయాధీశ ! మహేశా ! ॥శ్రీ॥
43. శుద్ధమనీషాన్విత మునిచర్చిత శుభతత్త్వాలయ ! ఈశా !
44. బుద్ధివివర్ధన కారణవర్తన ! భూమానంద ! బుధేశా ! ॥శ్రీ॥
45. భృత్యప్రియహిత పావనవర్తన ! నృత్యవినోదా ! ఈశా !
46. నిత్యానంద సుధారస సాగర ! నిరవద్యా ! నిఖిలేశా ! ॥శ్రీ॥
47. ప్రజ్ఞానాస్పద ! పాలితభువనా ! ఫాలవిలోచన ! ఈశా !
48. అజ్ఞానాపహ ! ఆర్యార్చితపద ! ఆర్తిహరా ! అమరేశా ! ॥శ్రీ॥
49. దమ్భ వినాశక ! తాప విభంజక ! ఢక్కాపరికర! ఈశా !
50. తుమ్బురునారద ! సేవ్యపదాంబుజ ! దురితవిదూర ! మహేశా ! ॥శ్రీ॥
51. అద్రిసుతాహృదయాంబుజ బంభర ! అలస్యాంతక ! ఈశా !
52. క్షుద్రవిచార నివారణబోధక ! భద్రాకర ! పరమేశా ! ॥శ్రీ॥
53. బ్రహ్మాకారస్థితి సంధాయక ! భ్రాంతి విమోచక ! ఈశా !
54. బ్రాహ్మీపద సుస్థిరత రభాస్వర! భావప్రద ! పరమేశా ! ॥శ్రీ॥
55. నినుగాఢంబుగ ప్రేమించెడి ఘననిర్మల మతినిడుమీశా !
56. ఘనకలుషంబుల కడిగి పవిత్రత కలిగించుము గౌరీశా ! ॥శ్రీ॥
57. నిరతము మనమున కూర్ధ్వగమనమిడి నినుగనజేయుము ఈశా !
58. పరిపూర్ణ శుభంకర దృష్టిని కరుణనొసగు పరమేశా ! ॥శ్రీ॥
59. కాలము గడచుచునున్నది కెప్పుడు కనిపించెదవో ఈశా !
60. జాలిని శ్రీఘ్రమెకనపడి నిర్మల సంతసమిడు జగదీశా ! ॥శ్రీ॥
61. భ్రమలకు లోనగు నట్టులొనర్చుచు బాధల బెట్టకుమీశా !
62. సమయగ జేయుము సకల భ్రాంతుల జ్ఞాననిధీ ! జగదీశా ! ॥శ్రీ॥
63. నీ శుభతత్త్వము నెఱిగెడి యోగ్యత నిల్పుము నాయెడ నీశా !
64. నాశము జేయుము మూలా జ్ఞానము పేశలహృదయ! నటేశా! ॥శ్రీ॥

65. కృపనాపైనిక నెప్పుడు జూపుచు నిపుణ సుధీనిడుమీశా!
66. చపలంబున నేసలిపిన చెడుకిక క్షమనువహించు మహేశా! ||శ్రీ||
67. ప్రతికూలంబుల మధ్య చలింపని స్థితశేముషినిడుమీశా!
68. గతి నీవేయని నమ్మితినన్నిక కరుణనుగను పరమేశా! ||శ్రీ||
69. నిగమార్థజ్ఞానంబు నొసంగుము నిండుదయనుగని ఈశా!
70. జగముల నన్నిటి నీలోగనుగొని స్వస్తిగనెద జగదీశా! ||శ్రీ||
71. ఏ కారణమున దూరముగా నన్నెప్పుడు జేసితి వీశా!
72. నీ కృప జూపుము నీలో జేరెద నేనిపుడో నిఖిలేశా! ||శ్రీ||
73. నిన్ను విడిచి నేవ్యథలను బొందుచు నిరతం బుంటిని ఈశా!
74. మన్ననతోనను జెంతకు జేరిచి మాపుమువ్యథల మహేశా! ||శ్రీ||
75. నమ్మిన భక్తుల నెన్నడు బాయక నెమ్మిని బ్రోతువె ఈశా!
76. క్రమ్మిన మాయను దొలగించుము నిను నమ్మినవాడ నటేశా! ||శ్రీ||
77. ఆనందేతర విషయస్పృహలిక నాపిముదంబిడు మీశా!
78. నానా దుఃఖములొందగ జాలను దీనావన! దేవేశా! ||శ్రీ||
79. సంకల్పంబులు జనియింపని ధీసంపద గూరిచి ఈశా!
80. శంకారహిత మహా సచ్చిత్సుఖ జలనిధి ముంచు మహేశా! ||శ్రీ||
81. నీదయలేని దదెట్టి వికాసము నేగనలేనో ఈశా!
82. సాదరమున నీసన్నిధి జేరిచి సద్దయగను సర్వేశా! ||శ్రీ||
83. నాపొరపాటులు నీకృపలేనిది నాకు తెలియవో ఈశా!
84. కాపాడుము నేపొర బడకుండగ కరుణాంబుధి! గౌరీశా! ||శ్రీ||
85. కోరను రాజ్యము కోరను నాకము కోరను పదవుల నీశా!
86. కోరెద నీపద నీరజ భక్తిని కూరిమి నిడుపరమేశా! ||శ్రీ||
87. అంతయు నీదైయుండగ నేనే మర్పింతును నీకీశా!
88. భ్రాంతిని నాదని తలచెడి తలపునె బాపుమిపుడు పరమేశా! ||శ్రీ||
89. విషమును మ్రింగి జగంబుల బ్రోచిన ప్రేమసుధాంబుధి! ఈశా!
90. విషమతి నేసల్పిన కలుషంబుల విడువడ జేయు మహేశా! ||శ్రీ||
91. ఎన్నోవిద్యల నేరిచినిన్నెగనకున్న వృథాగద? ఈశా!
92. నిన్నుగనుంగొని ధన్యతనొందెడి నేర్పునొసగు నిఖిలేశా! ||శ్రీ||
93. అతిశయ వర్తన లన్నిటి బాపి మహాదయ ననుగని ఈశా!
94. మితహితవర్తన నాకలవడ సన్మతియుతు సల్పు మహేశా! ||శ్రీ||
95. సత్యాహింసావ్రతముల జరిపెడి జాగృతి నాకిడి ఈశా!
96. నిత్యానంద మహా పదమున నను నిరతము నిల్పు మహేశా! ||శ్రీ||
97. సర్వసమాన మనీష నొసంగుము సాధు జనాదర! ఈశా!
98. గర్వముసుంతయు నాలో నెప్పుడు కలిగించకు గౌరీశా! ||శ్రీ||